# జ య ం తి ని





ఊటుకూరు సత్యనారాయణరావు

స్వామ్యాలు కవివే

# చిత్రభాను
## శరత్తు



బెజవాడ: ఆంధ్రగ్రంథాలయ ముద్రాక్షరశాల యందు
అయ్యంకి. వేంకటరత్నంపంతులు M. Sc. గారిచే
ముద్రింపఁబడియె.



మూల్యం
౦—౮—౦

# మనవి

ఆంధ్ర వాఙ్మయ సేవాసమితిపై కవిగారికి గల అవ్యాజప్రేమయే పోయిన మే నెలలో వారి నీయూరు తీసుకొని వచ్చింది. అప్పట్లో వారి ముద్రితాముద్రిత కావ్యరస రసాయనాన్ని మా సభ్యులకు రుచి చూపించి కొంత ఉత్తేజం కలిగించారు. మా ఆర్థిక పరిస్థితుల ననుసరించి చంద్రుడికో నూలుపోగు అన్నట్లు కూడా వారిని మేము సత్కరించ లేకపోయాం కాని రామారావు, విశ్వనాథరావు, బ్రహ్మానందం వగైరా ఉత్సాహవంతులూ నేనూ ఒక ఊహ ఏర్పాటు చేసుకొని మా తాహతుకు మించనివీ, చదువు తూంటే ఉల్లాసం కలిగించేవీ, అందరికీ సులభలభ్యమై భాషాభిరుచి కల్గించే టందుకు అవకాశం ఉండేవీ అయిన చిన్న పుస్తకాలేమైనా ఉంటే వాటిని మేము సమితి పేరిట అచ్చు వేయించుతాం, అనుగ్రహించి దయచేయిం చండి, అని మనవి చేయగా యీ జయంతిని, సులోచన, కులశేఖరాళ్వార్ అనే మూడు రేడియో నాటికలనూ వాగ్దానం చేశారు.

ఈ జయన్తిని ఆల్ ఇండియా రేడియోవారి మద్రాసు కేంద్ర మార్గంగా లోగడనే ఆంధ్రలోకానికి శ్రవణానందం కలిగించి ఉంది. ఇప్పుడు మా కృషి ఫలితంగా ఆంధ్రవాఙ్మయసేవాసమితికి నాల్గో కావ్యకుసుమంగా అలంకరించ బడుతోంది. ఈ విధంగానే మిగిలిన రెండు నాటికలనూ కూడా సుస్వరూపాన్ని పొందించి యీ సమితికి అపూర్వ సౌందర్యాన్ని కలిగించాలనే ప్రయత్నాన్ని మేమంతా చేస్తూనే ఉన్నాం. వీటి వల్ల వచ్చే ఆదాయం యేమైనా ఉంటే ఇంకో కవియొక్క రసవత్కావ్యాన్ని ప్రచురిద్దాం అని కూడా ఊహిస్తున్నాం. ఏమౌతుందో ఏమో.

కవిగారికి యీ సమితియందలి అవ్యాజప్రేమ ఇప్పటిదేకాదు. ఎప్పుడైతే దీన్ని స్థాపించామో అప్పటినుండీ కూడా వీరిందులో సభ్యులే. ఈశ్వరవత్సరంలోనే కాబోలు వీరు రచించిన "పాషాణి" నాటక ప్రతులు కొన్నిటి నిక్కడకు పంపి సమితియొక్క ఆర్థిక పరిస్థితులు చక్కబరచ మన్నారు. వాటివిషయం యేమయిందో కో. వెం. రా. ల. నా. శర్మగారి కార్యదర్శిత్వంలో గతించిన విషయం.

మ న వి

ఏది ఎలాగఉన్నా వీరి అవ్యాజవాత్సల్యాం లాగిన తీగల్లే సమితిక్షే మాన్నే అనుసరిస్తూన్నందుకు మే మంతా కృతజ్ఞుల మౌతున్నాం. అంతే కాకుండా కృతజ్ఞతాపూర్వక మైన వందనాలు సమర్పించుకుంటున్నాం.

మాజేటి రామారావుగారు ఈ గ్రామంలోని వైశ్యశిఖామణులలో ఒకరు. ఈ సమితికి వారొక కుడిభుజం అనే మా ఉద్దేశ్యం. ఏమంటే ప్రమాది సంవత్సరంలో కార్యదర్శిగాఉన్న కొ. వెం. రా. ల. నా. శర్మ గారి వ్యక్తిగత విషయాలకు ఈ సమితి లోబడిపోయి స్థానభ్రష్టయై వారెక్కడికేగిననూ అంకిసపట్టుకొని ఆ యా స్థానాలకు బద్ధకంకణియైపోతూ వారి చర్యలే శాసనాలుగా భావించే ప్రమాదపరిస్థితికి పాల్పడుట సంభవించింది. అప్పట్లో యీ రామారావుగారు ముందుకు వచ్చి ఒక భవననిర్మాణమునకు ఉపయుక్తమగు గోడలతోగూడిన నివేశనస్థలమును దస్తావేజు పూర్వకంగా యీ సమితికి దానంచేసి గృహస్థురాలుగా చేయుటలో మిక్కిలి తోడ్పడ్డారు.

అంతే కాకుండా కొంత ధనసహాయంకూడా చేసి ఉన్నారు. ఈ నాటికల ప్రింటింగు నిమిత్తమై వీరు ఉదారస్వభావంతో రు 30-0-0లు విరాళం ఇచ్చారు. ఈ విషయంలోనే కాక యీ సమితి చేసే సక్రమమైన భాషాసేవ కార్యరూపం ధరింప జేయడానికీ, మిక్కిలిగా ప్రోత్సాహం ఇవ్వటానికీ మొదటివారు రామారావుగారే.........కనుక యీ సుస్వభావుని యెన్నటికీ యీ సమితి మరువక కృతజ్ఞతాబద్ధయై యుండగలదనుట నిస్సందేహము. వీరి దాతృత్వబుద్ధికి కొదువకాని ఐశ్వర్యమును ఎల్లప్పుడూ శ్రియఃపతి ఆపాదించు చుండుగాక.

ఇట్లు, బుధజన విధేయుడు.

ఇంద్రకంటి వెంకట రమణమూర్తి

వ్యవస్థాపకుడు,

ఆంధ్రవాఙ్మయ సేవాసమితి.

కార్య స్థానం
బూర్గుంపాడు
20-7-1942



శ్రీ మాజేటి రామారావుగారు,
వైశ్యశిఖామణులు, బూర్గుంపాడు.

# కృతజ్ఞత

శుక్రుని తపోభంగం చేయబోయి తానే భంగపడినది జయంతిని. తపోభంగమైనా తరుణీప్రేమసామ్రాజ్యానికి అధినాయకుడైనాడు శుక్రుడు. ఇది కథాంశం.

చదువుతూంటె నాటకం ఆకర్షకంగా వుండకపోవచ్చు. కాని రంగస్థలంపై రక్తి కట్టించవచ్చు. చదవటానికి ఇంపుగా మధువు జాల్కొనినట్టు లుంటుంది ఒకనాటకం. అంతమాత్రంచేత అది రక్తి కడుతుందని చెప్పలేము. నాటకం కేవలం కవితాశిల్పంవల్లగాక ఘటనాసన్నివేశాలు ఒకదానితో నింకొకటి ప్రతిఘాతంపొందుతూ సాగిపోయేవిధానం వల్ల ఏర్పడుతుంది. దీనికి భాషాసహాయం కావాలె.

ఈ విషయంలో చాలా వాదా లున్నయి. కొందరు ప్రాంతీయభాష వాడుతున్నారు. అది మరొకప్రాంతంవారి అభిరుచి నందుకోలేకపోతున్నది. అందుకోసం గ్రాంథికం వాడుతారు కొందరు. భాషాసంస్కృతి లేని శ్రోతలు దీని నర్థం చేసుకోలేకపోతున్నారు.

ఐతే ఎంతటి సామాన్యభాషతోనైనా రసస్ఫూర్తి కలిగించవచ్చు. సందేహంలేదు. ఇటీవల నేను చాలా క్రొత్తనాటకాలు ప్రదర్శించటం రేడియోలో ప్రసారించటం ఎరుగుదును. అవి అన్నీ పరిపుష్టంగా కనిపించినై. కాని భాషాసామరస్యం కుదరకనే మనసు కెక్కలేదేమో నని పొడకట్టుతూ వచ్చింది. ఏ భాషఅయినా కథాస్ఫురణ కనువైన సౌకుమార్యంతో, శ్రుతికటువులేని శబ్దజాలంతో భావావేశాన్ని నిండించుకొని తన గమనాన్ని సాగిస్తే నటుని కష్టం ఫలిస్తుంది అనిపించింది. ఇంతకన్నా ఈ విషయాన్ని కొలిచిచెపుతే వికారంగా వుంటుంది. నాటకకారు లీ విషయంలో ఉత్తీర్ణులైతేనే తప్ప సర్వసామగ్రియు కలిగివున్నా నిరుత్సాహపరుస్తుంది లోకం.

# కృతజ్ఞత

పద్యమో, గద్యమో, దేనిలో ఆతడు ప్రయోగించినా పలుకుతుంది భావం — ఆ బాధ ఏమీలేదు.

ఇలా మనస్సులో పెట్టుకొనే సాగిస్తున్నాను నా నాటకరచనలు. ఎంతవరకు ఈ సాధకుడు సఫలీకృతుడౌతున్నాడో రచనలే ఆధారం. కేవలం ఊహలు కాదుగదా.

ఈ సామాన్య సాధకుని ప్రోత్సాహించేసే మూలకంగా రసికాంధ్రమును మేలుకొల్ప సమకట్టిన ఆంధ్రవాఙ్మయ సేవాసమితి వ్యవస్థాపకులు శ్రీ ఇంద్రకంటి వేంకట రమణకవి గారికి నా నమస్సులు.

సత్యనారాయణరావు.



శ్రీ ఊటుకూరి సత్యనారాయణరావు బహదర్,

ఆర్లపాడు.

# జయంతిని

[మానససరోవర ప్రాంతంలో శిలావేదికపైన ఇంద్రుడు—దూరంగా చెట్టుకొమ్మపైనుండి నెమలి క్రేంకారం చేస్తుంది. కొలనిలోని జలపక్షులు రెక్కలార్చినట్టు చప్పుడు వినిపిస్తుంది.]

ఇంద్రుడు

ఎవరు—వల్లకీ! మధువు.

వల్లకి

చిత్తం.

ఇంద్రుడు

శచీ!

శచీదేవి

రాత్రంతా ఇక్కడే వున్నారా? ఏమిటి విధీవిరామం లేకుండా ఎప్పుడూ మధువు సేవిస్తూంటే—? రాత్రి నిరీక్షించి, నిరీక్షించి ఎప్పుడు మేను వాల్చానో, మీకోసం కల్పించిన ఆ పారుజాతముల శయ్య, గాలి వచ్చినప్పుడల్లా తన సుగంధ సందేశాలు పంపిస్తూ ఇప్పుడే కన్నుమూసింది. శ్రీ చందన కలపము, గిన్నెలోనే ఎండిపోయింది....ఇటు చూడండి.... ఏమిటి అలా నిశ్వసిస్తారేమి?

ఇంద్రుడు

మనకు విపత్కాలము చేరువకు వచ్చింది.

శచీదేవి

ఏమిమాటలు......తప్పు...ఇప్పు డేమి వచ్చినదని?

ఇంద్రుడు

బలిచక్రవర్తి నూరవక్రతువు ప్రారంభించినాడు. రాక్షస గురువు శుక్రుడు, ఆ క్రతువు విజయవంతముగా సాగించి, ఇంద్రత్వమిప్పించటానికి గంధమాదనపర్వతం దగ్గర ఘోరంగా తపస్సు సాగిస్తున్నాడు......మనకు పదభ్రష్టత్వము తప్పదు.

శచీదేవి

రాక్షసులు అధర్మవర్తనులుగదా, వారికి విజయమా?

ఇంద్రుడు

కాదు — బలి, భాగవతోత్తముడైన ప్రహ్లాదుని మనుమడు, శ్రీహరి బలియెడల పక్షపాతి, దేవీ!

శచీదేవి

గత్యంతరము— ?

ఇంద్రుడు

పైగా శుక్రుడు శంకరుని గూర్చి తలక్రిందులుగా తపస్సు చేస్తున్నాడు. ఆ తపస్సే లేకపోతే.........

శచీదేవి

మరిచాను — మన ఊర్వశీ, మేనక లున్నారు కదా — వారిని పంపండి, ఓః, ఈ తపస్సుల కేమి—? మేనక విశ్వామిత్రు నంతవానిని వలలో వేసుకున్న నెరజాణ.

ఇంద్రుడు

అది తేలిపోయినది. చెరియొక నెల యుండి, సాధ్యము కాక వచ్చి వేసినారు.

శచీదేవి

ఆశ్చర్యంగా చెపుతున్నారే......చూడండి.

ఇ ం ద్రు డు

శుక్రుడు గొప్ప కవికూడా శచీ!

శ చీ దే వి

(నవ్వుతుంది) కవియా! ఇంకేమి—కవినే వలపింప లేక పోయినారా? ప్రకృతి విలాస లాలసుడైన కవినే రంజింప చేయ లేక పోయినారా? ఏమో............

ఏకొమ్మ కదలినా - ఏ కుసుమ మూగినా
ఆ కంఠమే వీణ - గా కదలి పాడుకొను
కవివలపు, మంచుతెర - కదలించి చూచుటే
ఎవ రెరుంగరు, మనసు - నవకాల సంపుటే.

ఇ ం ద్రు డు

వేదవేదాంగముల కధ్యాపకుడు.

శ చీ దే వి

కావచ్చును—

ఇ ం ద్రు డు

నిశ్చల బ్రహ్మచర్యవ్రత నిష్ఠాపరుడు దేవీ!

శ చీ దే వి

కావచ్చును—

ఇ ం ద్రు డు

నీ అభిప్రాయము—?

శ చీ దే వి

ఏమీలేదు — అతడు జగన్మోహనమైన సౌందర్యం, యౌవనం, తొలుకాడే బ్రాహ్మణ తేజస్సు కలవాడు గనుక...

ఇ ం ద్రు డు

కనుక, ఈ పాతబడిపోయిన రంభ, ఊర్వసులు ఏం పని కొస్తారనా—(చిరునవ్వు)

శ చీ దే వి

విచారంలోను చలోక్తులు కావాలె మీకు. అదికాదు, అతడు కవి. కేవలం శరీరపు తళుకుతో వంపుటొయ్యారాల వలనగాక, రసజగత్తు నుఱ్ఱూత లూగించే, విశ్వ సుందరి నిశ్వాసాల మాధుర్యానికి, కరగిపోతూన్న భావనాపరం పరను, గానంతో ముగ్ధుణ్ణి చెయ్యాలి; ఆ గానపుతీయం దనానికే ప్రతికవీ, తన సర్వస్వం బలిదానం చేసుకుంటాడు.

వేదవేదాంగముల కధ్యాపకత్వమేమి? బ్రహ్మచర్యా వ్రతనిష్ఠ లేమి—సర్వము ఆ గానానికి బలిచేస్తాడు కవి.

శరీర మంతా పుట్టలు పెరిగిపోయిన శల్య మాత్రుడు వాల్మీకి ఏమిచేసినాడు? బ్రహ్మ విద్యాయోగంలో పాతివేసు కున్న మనస్సుకు, ఒక్కసారి ఆ గానం వినిపించి, ఉవ్వెత్తుగా లేచి, రామాయణమహాకావ్యాన్ని, ముక్తకంఠంతో పాడివేసి శ్వాస క్రిందికి వదలినాడు—ఊర్వశి అలా చేస్తుంది. మేనక కేమి తక్కువదా—

ఇ ం ద్రు డు

ఏమో, అబ్బా నీ ఉపన్యాసం అదేదో, నాకే అర్థం కాలేదు. వీ రంతా, ఎంత చెప్పినా రెండోరకమె...

జ య ం తి ని

[దూరాన జయంతిని]

విరికన్నె సిగ్గుతెర
మరగు నూరుపు సెగల
సొగయు వాసన గాలి
సగమైన మాధవుడు
విధుర భావము దాల్చునో!
ఒంటిగా
వెఱ్ఱియై వెంటాడునో—??

ఇ ం ద్రు డు

ఆహా! ఎంత బాగుంది ఆ గీతం. ఆభావం, ఎప్పుడో— ఒకప్పుడు ప్రతి జీవితంలోను తొంగి చూసి పోతుం దేమోనని పిస్తూంది శచీ! ఎవ్వరా పాడింది.

శ చీ దే వి

మీాదంతా విచిత్రము. మన అమ్మాయి జయంతిని కాదు. ఇటే వస్తూంది.

ఇ ం ద్రు డు

మాతల్లి జయంతినియా - ఆఁ

జ య ం తి ని

[వస్తూ]

ఆ పాట వంపు, ముని
మాపు వెన్నెల కైపు
కలువ కమ్మని సుధలు
కరగి పోసిన కథల



1377

జ య ం తి ని

కీ జీవితమె మరచునో
స్వప్నలో
కాల మధురిమె వలచునో - ??

అమ్మా! ఇక్కడ నున్నావేమే — నాన్న కూడ యిక్కడే వున్నారే. తండ్రీ! నమస్కారం.

ఇ ం ద్రు డు

తల్లీ రా, ఇలారా,

జ య ం తి ని

ఏమిటి—అలా విచారిస్తున్నా రేమిటి? చెప్పరూ, అమ్మా, నీవేమన్నా వారి మనస్సు కష్టపెట్టావా?

శ చీ దే వి

లేదమ్మా - రాక్షసగురువు శుక్రుడున్నాడే—

జ య ం తి ని

ఎవరూ!—ఎవరో మహాకవి అంటారు, ఆయనేనా—

ఇ ం ద్రు డు

మా అమ్మ ఎంత ముగ్ధయో, అంత విజ్ఞానవతి.

శ చీ దే వి

ఆయన, గంధమాదనపర్వతం దగ్గర,

జ య ం తి ని

ఆఁ

శ చీ దే వి

ఘోరమైన తపస్సు చేస్తున్నాడు. తమ చక్రవర్తి బలికి ఇంద్రత్వం ఇప్పించాలని.

జ య ం తి ని

ఆ పదవి మనది కాదటే - ఆయన ఇప్పించటమేమిటి?

ఇ ం దు్రి డు

తల్లీ! నూరు క్రతువులు చేసినవానికి ఇవ్వవచ్చు—

జ య ం తి ని

బలి నూరూ చేసినాడా?

ఇ ం దు్రి డు

ఒక్కటే తక్కువ - దానిని చేయించాలనే శుక్రుని పట్టుదల.

జ య ం తి ని

ఆ క్రతువు చేయించలేక పోతే.........

శ చీ దే వి

లేకపోతే, మనకు కష్టాలే లేవు. మీతండ్రికదే విచారము.

జ య ం తి ని

మన కేమి — చేసుకోనివ్వండి పాపం......

ఇ ం ద్రు డు

పిచ్చితల్లీ! మన కీ సౌధాలు - ఈ యమృతము, ఈ నందనోద్యానం, కామధేనువు అన్నీ ఒక్కసారి మనను విడిచి పోతవి. మనం, బీదబికారులమై అడవుల నాశ్రయించ వలసిందే.

జ య ం తి ని

పోనీయండి — మనకెందుకీ స్వార్థం—? అమ్మా! ఏడుస్తావేమే —

ఇ ం ద్రు డు

జయంతినీ!

జ య ం తి ని

తండ్రీ! చెప్పండి.

ఇ ం ద్రు డు

కేవలం మన సౌఖ్యం కోసమే నేను విచారించటల్లేదు. వారు రాక్షసులు—ఈ దేవగణమంతా పుణ్యాత్ములు. వీరి జపతపస్సులు సాగనీయరు. వాండ్లాక్రమిస్తే ఋష్యాదుల నందరిని హింసించి క్షోభ పెడతారు. దేవతలు క్షోభిస్తే, దేవుడు క్షోభించినట్టే - ఏమీలేదు.........ఊర్వశీ మేనకల వశంకాలేదు......నీవు, ఆయన తపస్సునుంచి మనస్సు మళ్లించాలె...అంతే.

జ య ం తి ని

అంటె —

శ చీ దే వి

బాగానేవుంది. సరెలెండి. పదవి లేకపోతే మానెగాని, అయ్యో! ఈడువచ్చినపిల్ల, పసిగాయను పంపిస్తారా యేమి? మంచి ఆలోచనే తోచింది.

జ య ం తి ని

అమ్మా! వారిని చెప్పనియ్యి—ఆఁ ఏమిటి తండ్రీ! చెప్పండి.

శ చీ దే వి

అమ్మాయీ, రా వెళ్లుదాము. బాగానే వుంది బోధ—శక్తివుంటె సమర్థించుకోని ఇంద్రత్వం నిలబెట్టుకోండి, లేకపోతే మానుకోండి. ఇట్లాంటి పనులు మాత్రం జయంతినితో చేయించకండి—రా—జయంతినీ—

జ య ం తి ని

ఇ ం ద్రు డు

మనవలన దిక్పాలకులకు, దేవతలకు, అప్సరలకు, సర్వ నాగరజగత్తుకు, సృష్టిశాసకుల కందరకు విపత్తు మూడుతుంది, శచీ!

జ య ం తి ని

అమ్మా! వెళతావేం—ఏమిటీ తొందర?

శ చీ దే వి

నీవూ, ఆ తండ్రికి తగినకూతురువే—నేను వెళతాను. ఇలాంటి పురాణాలు నాకు పనికిరావు.

ఇ ం ద్రు డు

జయంతినీ! ఆ శుక్రుడు తపస్సునుంచి విముఖు డవుతే చాలు. ఆ క్రతువు సాగదు — నాగరక శాంత జగత్తుపై క్రమ్ముకొని వస్తూన్న ఈ కారుమేఘాలు చెదరిపోతవి. ఇది మహా క్లిష్టసమయం.

నీ శరీర సౌందర్యంతో ఆతనిని ముగ్ధుణ్ణి చేయాలి. నీ గానానికి, పరిచర్యలకు శుక్రుడు సమ్మోహితుడై పోవాలి.

జ య ం తి ని

ప్రేమించవలెనా—

ఇ ం ద్రు డు

కాదు, కాదు.

జ య ం తి ని

ప్రేమించకపోతే......ఎలా సాధ్య మాతుంది.

ఇంద్రుడు

ఏమీ లేదు—ఆయన సమాధి నిష్ఠ చెరిపివేయటానికే ఇదంతా, కేవలం నటనమాత్రమే—

జయంతిని

తండ్రీ! ప్రేమ నటిస్తారా—నటించేది ప్రేమ అవుతుందా?

ఇంద్రుడు

జాగ్రత్తగా, ఆయనకు పూజాదికముల నందిస్తూ, అదంతా మరచిపొయ్యేట్టు చెయ్యాలమ్మా—అంతే.

జయంతిని

ఏమో, నాకేమీ తెలీటంలేదు......ఆయన దగ్గర నుంచి మళ్ళీ వచ్చివేయవలెనా తండ్రీ!

ఇంద్రుడు

ఔను. మన కేంపని — నీకు కావలసిన అన్ని సౌకర్యాలు నేను ముందుగానే చేసి వుంచుతాను—నీ కేం భయము లేదు. మాలినిని వెంట వుంచుకో—తెలుసునా—

జయంతిని

సరే—మీ ఆజ్ఞ నతిక్రమించలేను ... ... దేవరాజు కన్నీరు చిందించటం లోకమే హర్షింపదు-

జయంతిని

[గంధమాదన పర్వతం దగ్గర శుక్రుడు తపస్సు చేసుకుంటూ వుంటాడు.]

శుక్రుడు

ఈశాన స్సర్వ విద్యానా మీశ్వర స్సర్వ భూతానాం
బ్రహ్మాధి పతి ర్బ్రహ్మణోధిపతి ర్బ్రహ్మ శివోమే అస్తు
సదాశివోమ్.

[కోకిల "కూ" అని కూస్తుంది. జయంతిని తిరిగి "కూ" అంటుంది.]

జయంతిని

(దూరంగా)

వలపు మురిపిస్తాను
తలపు మలపిస్తాను
తళుకు మంటూ తొలగి
కులికి నటియిస్తాను
ఈ నిష్ఠ యీ యోగ
మెన్నాళ్ళులే తపసి!
(అహహహహహ నవ్వుతుంది-)

మాలిని

జయంతినీ! రా—రా.

జయంతిని

[పరుగెత్తి వచ్చిన ఆయాసంతో] ఏమైన దే—కనులు విప్పెనా.

చెప్పు—

జ య ం తి ని

మా లి ని

ఆఁ, ఎప్పుడూ నీ ఆటలు నీవూను. ఆ కోయిల కూతకు మళ్ళీ నీవు "కూ" అనలే-

జ య ం తి ని

ఔను.

మా లి ని

అప్పుడు, ప్రసన్నంగా ఒక్కమారు రెప్పలెత్తి, తిరిగి మూసినారు. రెండుమాసాలనుంచీ చేస్తూన్న పరిచర్య, ఒక్క క్షణంలో వృథాచేశావు.

జ య ం తి ని

ఓః, ఫరవాలేదు.

వల పొక్క మాటగా
వయ సొక్క పాటగా
ఒలికించి యీ శరీ
రోద్యాన మేలింతు

ఈ నిష్ఠ, ఈ యోగ
మెన్నాళ్ళులే తపసి.

మా లి ని

అదుగో - అదుగో - కదలినారు.

జ య ం తి ని

చూశావే, ఎంత అందమైనవాడే......

జ య ం తి ని

కోడెవయస్సులో బుసలుకొట్టెడు నెత్తురుపొంగు, లోన రా
పాడినరంగు ఇంద్రధనువై దిగివచ్చెనొ వీని మేనిపై
పాడునొ వీని కన్నులు, నవప్రణయోదయ హాసరేఖ సై
దోడయి తెల్లతామరలతో — మది నేదొ కలంచు మాలినీ!

చూడవే, ఈ శరీరం శీతాతప బాధలకు వాడిపోలేదు. యోగముద్రలో మూసిన ఈ కళ్ళు, చిరంతన ప్రియా సమాగమంలో ఒత్తిగిల్లిన సుఖానుభూతివలె వున్నాయి మాలినీ! ఆ పెదిమలు నాతో ఏమో మంతనము లాడుతున్నట్లున్నాయి...

మా లి ని

అదిగో - జారి పోతున్నావు - నీ వలలో ఆయనను పడేసుకోవాలిగాని, ఆయన వలలోనే నీవు పడుతున్నావు, చివరకు.

జ య ం తి ని

ఉండవే — ఊర్వశీ మేనకలు వచ్చి వలపు నటించారట! వలపు నటిస్తారటే......?

మా లి ని

కార్యావసరం కోసం.........

జ య ం తి ని

కార్యావసరానికి కామ మేమిటి — వాళ్లకు స్త్రీహృదయం లేదు. నే నీయనను వదలి పోగలనా? నా కీతడే అధీశ్వరుడేమో — మాలినీ!

మా లి ని

మంచిపనే...అసలే మునులు కూడాను, నిరాకరిస్తే...

జ య ం తి ని

నన్ను నిరాకరిస్తాడా !మాలినీ! నన్ను......ఇటు చూడు... నేనేమి వంచించటానికి వచ్చానా?

మా లి ని

మరి దేనికి? ఈయనతో ఇక్కడే......బాగా వుంది. మీఅమ్మ యీ మాటవింటె ఏంచేస్తుందో తెలుసునా...... అదుగో...అదుగో మళ్లీ లేస్తున్నట్లున్నారు. మనం ఇలా, ఈ పొద చాటుకు పోదాం—రా.

జ య ం తి ని

మాలినీ! నేను కదల లేను...అడుగు వెయ్య లేక పోతున్నాను.

మా లి ని

నే వెళ్ళుతున్నాను—అయ్యో—రావేమే — రా — (రహస్యంగా)

జ య ం తి ని

నేను రాలేను—ఒక్క అడుగూ వెయ్యలేను—పైగా ఈ మనస్సు—

ఈమనసు ఈతనువు
ఏమో, అతనిపాద
సీమాంచలములంటి
సేవకై పరచుకొని

జ య ం తి ని

కామించె - ప్రేమించె
కదలి రాలేనింక........కదలి రాలేనే॥

మా లి ని

అదుగో, లేచినాఁ——నాకు తెలియదు - నీ యిష్టం - నే వెళ్లుతున్నాను.

శు క్రు డు

ఎవరూ......శరీర మంతా అడవిపూలు అలంకరించుకుంది. తీవలతో మొలనూలు నల్లినది. దేవకన్యలా వుంది. అరవిచ్చిన కోలకళ్ళతో ఆ వొళ్లు విరుచుకునే ఒడలి వంపులలో; ఎంత శృంగారం. అడుగుతాను. తప్పే ముంది...... మీా రెవ్వరు ?

జ య ం తి ని

ఈ చరణదాసి నంత గౌరవముగా అడుగవలెనా......

శు క్రు డు

దాసి——నీవు దాసివా——?

జ య ం తి ని

ఔను. రెండు మాసాలనుంచి, తమ సన్నిధిలో——
ఆశ్రమ వాసం చేస్తూ.........

శు క్రు డు

అయ్యో——నీ నివాసము?

జ య ం తి ని

ఇక ముందు ఈ ఆశ్రమమే.

జయంతిని

శుక్రుడు

పేరు——

జయంతిని

దాసి

శుక్రుడు

నేను తపస్విని- నా కేమీ పరిచర్యలతో పనిలేదు... నీ వీ ఆశ్రమంలో కందమూలాలు తింటూ, ఈ క్రూరమృగాల మధ్యలో ఎందుకుంటావు——?

జయంతిని

నా కిక్కడే, మీ పాదసేవ చేస్తూంటేనే శాంతిగా వుంది.

శుక్రుడు

మే మెందుకీ నిర్జనారణ్యంలోకి వచ్చామో తెలుసునా?

జయంతిని

ఏమో............

శుక్రుడు

స్త్రీలు రాకూడదు......వస్తే మా తపస్సు సాగదు.

జయంతిని

చిత్తం. మీ తపసుకు ఏమీ భంగం రాకుండా వుండాలనే ఈ దాసి కోరుతూంది.

శుక్రుడు

వలదు —నీవంటి పడుచు గుబ్బెతలు——

జ య ం తి ని

యౌవనము తపస్సుకు భంగకరమా స్వామీ! క్షమిం
చండి—తాము పడుచువారు కారా?

మావి గున్నలశాఖ
మాధవీలత ప్రాకి
నేరమా - ఆప్రేమ
భారమై పోవునా
భావుకుడవే తపసి!?

శు క్రు డు

వలదు. వెళ్లుము - అశాంతి... అశాంతి.

జ య ం తి ని

స్వామీ!

గిరిరాజు పాదాల
కొరిగె కిన్నెరసాని
నేరమా — ఆ ప్రేమ
భారమై పోవునా
భావుకుడవే తపసి!??

శు క్రు డు

వలదు—వెళ్ళుము. నీ ఉనికి మా కపాయకరము.
వెళ్లు.

జ య ం తి ని

ప్రకృతి కాంతనె ప్రేమ
భావడోలా కేళి,

జ య ం తి ని

లాలించుకొను కవికి
ఈ లేత ముద్దరా
లెంత ఓహో ! తపసి.... ??

శు కు్రి డు

ఊశ్ - వెళ్ళమనలేదా- (ఆశ్రమపు తడిక వేసుకుంటాడు)

జ య ం తి ని

ఆశ్రమపు తడిక వేసుకున్నాడు—అబ్బా! ఎంత నిష్ఠురుడు. ఎంత తేజశ్శాలి. నవనవోన్మేషమైన యౌవనం, ఈడు జవరాలిని, ఒంటరిపాటున,— ఇంత నిష్ఠురంగా త్రోసివుచ్చునా- తపోభంగ మేమో- కాని నా ఉత్సాహ భంగమైనది, మాలినీ!

మా లి ని

నేను చెప్పలేదా—ఎంత యువకుడైనా ఆ మాత్రం దృఢ దీక్ష లేనిదే తపస్సుకు కూచున్నాడా?

జ య ం తి ని

కాదే—ఆ హృదయంలో దౌర్బల్యం వుంది.

మా లి ని

అదిగో—మళ్ళీ. జారిపోతున్నావు.

జ య ం తి ని

చెప్పనీ, ఆ కళ్ళలో స్త్రీ సానుభూతి వుంది. ఆ మేధస్సులో ప్రేమవాహినుల కదలికలు చూశాను, మాలినీ!

మా లి ని

నువు చూడకేమి......

జ య ం తి ని

మాలినీ, మాటలు మందముగా—శిథిలముగా వున్నయి.

మా లి ని

నెరజాణ మేనకకే వశం కాలేదు, ఈతడు.

జ య ం తి ని

నీకు తెలియదే—వారు వంచకులు—వారికి ప్రేమ తెలీదు.

మా లి ని

అదిగో, మాట్లాడితే ప్రేమ—ప్రేమ......మనం అందుకోసంగాదు వచ్చింది.

జ య ం తి ని

తపస్వీ......తపస్వీ ! (తన్మయురాలైతుంది)

[ఆశ్రమంలో ఆనాడు శుక్రుడికి తపస్సే సాగలేదు.]

శు క్రు డు

ఆపలేక మనసు, నాపైన
నవసెనో—కృశియించి, సమసెనో.... ...
పడుచు లేడీకళ్లు - పరవశతచే ప్రేమ
భావాల యొరపులో - వలపె చిగిరింపగా ॥ఆపలేక॥
పరు లెరుంగని కన్నె - సిరుల నునువంపులో
మసక వెన్నెలనీడ - మరగి పోలేదనీ ॥ఆపలేక॥

[పెద్ద వర్షం - గాలి]

జ య ం తి ని

(బయట) ఎట్లా పిలిచేది. ఈ పెద్దకొమ్మలూగుతున్నయి, విరిగి పడతవేమో......చెట్లఆకు లెంత సేపని వర్ష పాతాన్ని ఆపుతవి? వణుకు పుచ్చుకుంటున్నది. పిలిస్తే - శపిస్తారేమో

శు క్రు డు

(లోపల)

వలయముగ ద్రిప్పి వెన్నున కలిపికట్టు
వల్కలము జారిపోయిన, వలుదయురము
నరసితినొ యంచు ప్రక్కకు తిరిగిపోయె
పరవశమ్మున నాతల తిరిగిపోయె.

వల దన్నాను—తిరస్కరించాను. ఈ తపస్సు, తపించి పోయే ఆజవరాలి తాపం కన్నా ఎక్కువదా - ఈ వర్షానికి ఏ చెట్టుకింద వణకిపోతున్నదో - గాఢాంధకారంగా వుంది. తడిక తీసి చూస్తాను. రెండునెలలనుంచి నాకోసం - నాకోసం ఎంత పరిచర్య చేస్తున్నదో.

జ య ం తి ని

పిలుస్తాను — అబ్బా...ఛలి...ఛలి. స్వామీ-స్వామీ-

శు క్రు డు

ఇక్కడనే వున్నావా? ఈ వర్షంలో - ఈ హోరు గాలికి, శంకిస్తావేం—రా—లోనికి రావచ్చు—పాపం, బట్టలు, తల, అంతా......

జ య ం తి ని

ఛలి — ఛలి...సమిధెలుంటే మంటచేసుకుంటాను.

శు క్రు డు

పాపం — అన్నీ తడిసిపోయినై. అగ్నిహోత్రంకూడా చల్లారిపోయింది.

జ య ం తి ని

ఛలి—వణుకుపుడుతూంది. స్వామీ! ఇలా...కొంచెం.

శు క్రు డు

ఏంకావాలి — దూరంగా వుండు.

జ య ం తి ని

ఎలావుండడం — ఆ హా హా హా (వణుకుతుంది)

శు క్రు డు

అయ్యో. అయ్యో! నే నేం చేసేది. పాపం. చాల బాధపడిపోతూంది.

జ య ం తి ని

స్వామీ! స్వామీ......(వణుకుతూ)

శు క్రు డు

ఆఁ

జ య ం తి ని

కొంచెము మీ చేయి, ఇలా...ఈ

శు క్రు డు

ఏం చెయ్యమంటావు. ఇంత సుకుమారమైన శరీరం—

జయంతిని

అసలే సన్నని పాముకూసంలాంటి వస్త్రం - పూర్తిగా తడసి నీళ్లు కారుతున్నది.

జయంతిని

ఆ, తమ వెచ్చని పవిత్రహస్తాలు ఇలా - యీ నా వక్షస్థలంపైన ఒక్కసారి—ఒక్కసారి ఆనించండి.

శుక్రుడు

అమ్మో - తాకటమే - వద్దు ... వద్దు ... తప్పు ... అసలే దీక్షలో వున్నాను.

జయంతిని

అబ్బా! ఇక ఈ ప్రాణాలు నాలో నిలిచేటట్టు లేదు. ఒళ్ళంతా శైత్యమైపోయింది. స్వామీ! ఏమిదీక్ష - ఇన్నాళ్ళనుంచి మీ పాదసేవ చేస్తూ, ఈ శరీరాన్ని కందమూలాలతో, కృశింప జేసుకొని .....

శుక్రుడు

నిజమే, నిజమే - నేనేలా తాకేది? పెద్ద సంకటమే వచ్చింది.

జయంతిని

కృశింప జేసుకొన్న చరణదాసికి, ప్రాణదానం చేసే టప్పుడు. దీక్షయా స్వామీ—?

జ య ం తి ని

శ క్రు డు

నిజమె - నిజమే—ఇలా - రా, ఆఁ ఎందుకు చెప్పు —

చేతులు లాక్కుంటావేమి - ఆగు.

జ య ం తి ని

ప్రియా—హృదయేశ్వరా ! నేను జయంతిని.

శ క్రు డు

జయంతినీ—

[ఆశ్రమంలో — సంవత్సరం గడిచిపోయింది]

జ య ం తి ని

సెలయేటి పక్క మలపులలోని తెలినీరు
మలయానిలాని కూయెలలూగు తీవలూ
అలము రాతిరి కొసల కల అల్లుకొను పూలు -
మలచుకొనె, నాక సుఖములు నా కవేలా.....
నా కవేలా..........నా కవేలా॥

స్నానానికి వేళయింది. అన్నీ సిద్ధం చేయాలి.

శు క్రు డు

పక్షులకన్నా ముందు లేస్తుంది. ఏమేమో, ముందుగా సిద్ధంచేసి పెడుతుంది. తుమ్మెదలు తేనె తాగటానికి ముందే పూజకోసం పూలు సేకరిస్తుంది. అదుగో, స్నానాని కని కమండలము, కాళ్ళ పాదుకలు తీసుకొని వస్తోంది.

జారిన కైశికంబు, అరజారినపయ్యెదకొంగు, మేనిపై
తేరిన ఊర్పుపొంగు, నిజతేజము చెందినరంగు, అద్దిరా!
కూరిమిమీరి ఇంత అనుకూలపు హంగునొనర్చి నాకు గా
ఈ రమణీలలామ ఘటియించెడి స్వర్గసుఖానుభోగముల్.

జయంతినీ —

జ య ం తి ని

వస్తున్నాను.

శుక్రుడు

తొందరలేదు.

జయంతిని

ఇవిగో పాదుకలు — కమండలము.

శుక్రుడు

కాళ్లు పట్టుకొని తొడిగించాలా యేమి ప్రియా - ఏమిటది. లేలే. ఉండు. వస్తాను మరి.

జయంతిని

ఎంతసేపౌతుందో వచ్చేవరకు-

శుక్రుడు

ఇప్పుడే వస్తాను. వచ్చిన తరువాత పూజా అదీ వుంటుంది. పూజాద్రవ్యాలు సిద్ధం చెయ్యి.

జయంతిని

అబ్బా ! రోజు ఏమిటే పూజలు——?

శుక్రుడు

(చిరునవ్వి) వారానికోమాటు చేసుకోమంటావా ?

జయంతిని

మానేస్తే యేమి - ఎప్పుడూ ఒకటే...

శుక్రుడు

ఉండూ- చూడు- మాట- మాలిని చూస్తుందేమో...

జ య ం తి ని

ఏమిటది. స్నానం కూడా మానెయ్య మంటావా? పోనీ మానేస్తాను. శలవైతే...

జ య ం తి ని

మీరే మహాజ్ఞానులు లెండి... సరేనా...

శు క్రు డు

కోపం చాలించి, దేవిగారు - పూజాద్రవ్యాలు సిద్ధం చేయండి. స్నానం చేసి వస్తాను.

జ య ం తి ని

మాలినీ - మాలినీ !

మా లి ని

చూస్తూనే వున్నానులే అంతా......

జ య ం తి ని

ఓసీ, కొంటెపిల్లా—

మా లి ని

నే నా పైగా......ఎన్ని వగలు నేర్చావే! ఎవరో వస్తున్నారు. అదుగో మీ నాన్నగారు. రారు—సంవత్సర మైంది. అజపజ లేక పోతేనూ—

ఇ ం ద్రు డు

మాలినీ !

మా లి ని

దయచేయండి.

ఇ ం ద్రు డు

జయంతిని ఏదీ?

జ య ం తి ని

వస్తున్నా తండ్రీ!

ఇ ం ద్రు డు

ఏమీ వద్దు, కృష్ణాజినము, వ్యాఘ్రాజినమూను, ఇక్కడ కూచుంటా లె. మా తల్లీ! ఇలా దగ్గరకు రా.

జ య ం తి ని

అమ్మ కులాసాగా వుందా.

ఇ ం ద్రు డు

ఆఁ ఆఁ. కాని మీ అమ్మకు ఒకటే బెంగ నీమీద. ఆచార్యు లేరీ! నా ఆజ్ఞ నెరవేర్చావా తల్లీ.........

మా లి ని

ఓః, సంపూర్ణంగా—ఇహ ఏమీ లేదు.

జ య ం తి ని

(కసురుతూ) ఏమిటే ఊరికే......

ఇ ం ద్రు డు

తపస్సు ఏమీ చెయ్యట ల్లేదా? జయంతినీ!

జ య ం తి ని

తపస్సు లేదు,-ఏమీ లేదు. సంధ్యావందనం అంటూ చేసుకుంటారు.

జ య ం తి ని

మా లి ని

ప్రభూ! అది కూడా ఏదో—

ఇ ం ద్రు డు

ధన్యుణ్ణి, ధన్యుణ్ణి, అమ్మా! నీ వల్ల స్వర్గలోకమంతా సంరక్షింప బడింది. పోదాము రా, ఇంకా ఏంపని మనకు-?

మా లి ని

రా జయంతిని, పోదాము—

జ య ం తి ని

ఏమిటే వేళాకోళము. వెళ్లితే వెళ్లతాను. ఏమి వెళ్ళనా?

మా లి ని

నేనేమన్నా - ఏమి ఎందుకు వెళ్లరు- చుట్టాలను చూడటానికి వెళ్లరేమి అంతా.

ఇ ం ద్రు డు

ఏమిటమ్మా జయంతినీ! రావూ - పిచ్చితల్లీ!

ఏం మాట్లాడవు, అయ్యో! ఈ అడవుల్లో, ఆశ్రమాల్లో! నీ కేమంత వచ్చింది.

జ య ం తి ని

ఇక్కడ ఏమీ కష్టంగా లేదు తండ్రీ! మన అమరావతీ ప్రాసాదాలలో కన్నా ఎక్కువ ఆనందంగా వుంది నాకు.

ఇక్కడ నెమళ్ళు, హంసలు, యాగధేనువు అన్నీ,

జ య ం తి ని

మానవానురాగంతో, దేవతా త్యాగంతో నా అన్ని పను లలో తోడ్పాటు చేస్తున్నయి......

సీ॥ పించంపు కుంచియ విప్పి, ఆశ్రిమ మూడ్చి
కను మూత లోపల జను మయూరి
కొలనిలో తడిసి, రెక్కలయంచు గుమితోడ
చేరి, హంసిని నీరు చిలకరించు
పలుకాటు నందని తొలికారు ఫలముల
శోధించి గొని యిచ్చు శుకకుమారి
పొదుగు భారమ్ముతో పొదలు యాగపుటావు
వెచ్చ వెచ్చని పాలు పిదికిపోవు
గీ॥ ఉదయ సాయంతనముల యం దొక్కమారు
భ్రిమరముల్ మేళవాద్యముల్ పాడి యరుగు
నాశ్రిమోపాంతసీమలయందు తండ్రి!
ఎంత పుణ్యంబొ ఇచట వసించియుంట.

ఇ ం ద్రు డు

నిజమే — మనకు లేవమ్మా ఇవన్నీ.

జ య ం తి ని

ఈ జీవనం కేవలం సహజమైంది. పవిత్రమైంది తండ్రీ.

ఇ ం ద్రు డు

ఎప్పుడైనా కావాలంటె రావచ్చు - చూడవచ్చు - అంతేకాని; వెళదాం రా తల్లీ!

మాలిని

జయంతినీ ! నావేపు చూస్తావేమి ? ప్రభూ ! సంవత్సరం నుంచి ఇక్కడే వుండిపోయిన అలవాటు వల్ల...

జయంతిని

అలవాటేమిటే - ఏమీలేదు. వారికి తెలిపి, అనుజ్ఞ తీసుకొని వెళ్లితే బాగుంటుందేమో - స్నానానికి వెళ్లినారు.

ఇంద్రుడు

తెలిపేదేమిటమ్మా, ఊరక ఆయన తపోవిఘ్నంకోసం వచ్చావు అంతే. మన పని తీరిపోయింది.

జయంతిని

స్వర్గానికి వచ్చి నేను చేసేది మాత్ర మేముంది తండ్రీ!

ఇంద్రుడు

ఏమిటమ్మా! అదేమిటి? అలా అంటావు- ? వివాహం కావలసిన దానివి.

జయంతిని

వివాహమా ?

ఇంద్రుడు

ఇప్పటికీ చేయలేదని మీ అమ్మ ఒకటేగోల. చేస్తాను. అలా అంటా వేమిటి ?

జయంతిని

స్త్రీ ఒక్కసారి, ఒక పురుషునిపై దృష్టి సారించి, తన శరీరంతో ఆకర్షించిన తరువాత—అన్యభ్రాంతికి లోనౌతుందా?

మా లి ని

అది తపోభంగంకోసం చేసిన నిమిత్తమైన నాటకం.

జ య ం తి ని

మాలినీ! ఉత్తమస్త్రీలు తమ దేహాన్ని నటనకు అప్పగిస్తారటే—

మా లి ని

ఊర్వశి—రంభ—మేనక.

జ య ం తి ని

ఊరుకో—ఏమి మాట్లాడుతున్నావు మాలినీ! జయంతినిని, ఊర్వశి, మేనకాదులతో ఉపమిస్తున్నావా? అట్లా చెప్పేముందు నీ మనస్సు చకితం కాలేదా? నీ కంఠంలోని తంత్రులు కంపించిపోలేదా—?

జయంతిని – ఆదర్శపతివ్రాణ, పవిత్రశీలయైన శచీదేవి కూతురు. ఆమె సర్వభోగాలు, అరణ్యంలోనైనాసరే, పతి పాదసీమలో సృష్టించుకుంటుంది, కాని—తండ్రి వైభవంలో నుంచికాదు—పతి దారిద్ర్యంలో ఫలభాగిని కావడమే పరమానందం కాదో పడతికి—!!

ఇ ం ద్రు డు

అమ్మా – దేవతలు......

జ య ం తి ని

దేవతలు స్వేచ్ఛాప్రియులనా తండ్రీ! స్వేచ్ఛ అంటె—కట్లు బొట్లు సాంఘిక నిర్బంధాలు లేకుండానే తమ శీలాన్ని

జయంతిని

కాపాడుకోగల శక్తి అన్నమాట. మానవులు దుర్బలులు. ప్రకృతి భోగాలకు వారి మనస్సులు లోబడిపోయి, ఆదర్శాన్ని కోలుపోతారు. అందుకోసం వారిని శాస్త్రాలు శాసిస్తాయి.

దేవతలో — స్వయంగా తమ ధర్మాన్ని నిర్వహించుకోగల తేజోవంతులు సహజ తేజస్సుతో నడచి పోగలిగిన కారణంచేత స్వేచ్ఛావర్తను లంటారు. మనం మానవులకు ఆదర్శపాత్రియులం కావద్దా—తండ్రీ!

మాలిని

ప్రభూ! లాభం లేదు...శుక్రుని దప్ప అన్యపురుషుని ఆమె కన్నెత్తి యైన చూడదలచుట లేదు.

జయంతిని

తండ్రీ ! వారి ఘోరమైన తపస్సు భంగంచేసి, వారి మహదాశయాన్ని భంగం చేశాను——నేటి ఈ జీవితం కూడా భంగం చేస్తానా ?

తండ్రీ ! మీరు మాకు పూజ్యులు. కొన్నాళ్ళిక్కడ వుండి, మా ఉభయుల ఆతిథ్యాన్ని స్వీకరించాలె.

ఇంద్రుడు

ఆతిథ్యం కూడానా ? ఆయన రాక్షస విజయం కోరి చేసిన తన తపోభంగం కోసమే ఇలా నిన్ను పంపించానని తెలుస్తే నన్ను శపించకుండా వదులుతాడా ? వంచకురాలవని నిన్ను మాత్రం శపించడా తల్లీ !

జ య ం తి ని

అలాంటి వారు కాదు. ఉండండీ తండ్రీ !

ఇ ం ద్రు డు

నీకు తెలియదమ్మా !

మా లి ని

అరుగో స్నానంచేసి వస్తూనే వున్నారు. ప్రభూ !

ఇ ం ద్రు డు

(వెళ్లుతూ) అమ్మా ! ఆ రాక్షసులలో ఎలా కాపురం చేస్తావో తల్లీ ! స్వర్గానికి రావా......మీ అమ్మ నీ కోసం...

జ య ం తి ని

తండ్రీ ! విచారించకండి.

ఇ ం ద్రు డు

స్వర్గానికి తిరిగి ఎన్నటికి రావా తల్లీ.........

జ య ం తి ని

తండ్రీ! నా కిదే స్వర్గం. ...ఇదే మోక్షం......... క్షమించండి.